**AGNI SWARALU**
(Poetry)
by
**Dr. M. Chennappa**, M.A., M.Phil., Ph.D.
Associate Professor, Dept. of Telugu, Osmania University
Hyderabad-500 007 (A.P.)



ప్రచురణ సంఖ్య : 10.
ప్రథమ ముద్రణ : డిసెంబర్ 2000
ప్రతులు : వెయ్యి
మూల్యం : రూ. 25/-

ప్రతులకు :
ప్రమీలా ప్రచురణలు
12-11-1095/A,
వారాసిగుడా, సికింద్రాబాద్-500 061.
ఫోన్ : 7078508

*Akshara Alankarana* :
**Satya (PG)**, Tel : (O) 7622859, (R) 7138912

Designed & Printed at :
**Mounika Graphics,**
1-4-27/71/187, P.S. Colony,
Hyderabad - 500 080. Ph : 6212430

# అంకితం



తమ జీవితాన్ని వైద్యవృత్తికి అంకితం చేసిన
అపర ధన్వంతరి
అడిగిన వారికి లేదనకుండా ఇచ్చే
దాత
విద్వజ్జన పరితోషి
వేదవిజ్ఞాన సముల్లాసి
డా॥ మీనపల్లి సంజీవరావు గారికి
అగ్నిస్వరాలు అంకితం

# అగ్నిస్వరాలు

ఎంతకాలము మందబుద్ధుల
కీజగత్తును దత్తపరుతురు ?
కలుషితాహారమ్ము గొని యా
రోగ్యమును పోగొట్టు కొందురు ?

ఉపనిషత్తులలో రహస్యము
లున్నవని తెలియంగవలదా ?
ఆలసింపక తెలిసి వాటిని
అందరికి బోధించ వలదా ?

కవులు వైదిక ధర్మ పథమున
కలము బట్టి చరించవలదా !
అందరికి నామోద యోగ్యము
వేదమేనని తెలియ వలదా ?

ఎక్కడో దూరానున్నది
యెగసిపట్టగ జూతువేలా ?
గుండెలోపల నున్న దానిని
గుర్తుపట్టగ జాలవేలా ?

కొత్తగా నీవిపుడు సత్యము
సృష్టిచేయగ జూతువేమీ ?
బుద్ధిమంతుడవైన నింకను
దాని నన్వేషింపవలయును

భూమి గుండ్రని దనుచు మన భూ
గోళ శబ్దమె చెప్పుచుండగ
భూమియాకారమ్ము గూర్చిన
చర్చ చేయుట వ్యర్థమే కద !

మనుషులందరి దొక్క జాతియె
స్త్రీ పురుషులది యొక్క జాతియె
దేవదానవ మనుజ సంతతి
నొక్క జాతిగ తెలియవలయును

ఆకృతి గ్రహణమ్ము చేతను
సమాన ప్రసవమ్ము చేతను
జాతి గుర్తింపంగ బడునని
న్యాయశాస్త్రము సెప్పుచున్నది



కోతి యెవడో కోతి నుండియె
నరుడు వచ్చాడనుచు చెప్పిన
అదియె నిజమని నేటి రచయిత
లబ్బురమ్ముగ గాథలల్లిరి !

"శూన్యమందే సృష్టియేర్పడి
శూన్యమందే కలిసిపోవును
శూన్యమే జగమంత" యనియెడి
శుష్కవచనములొప్పకండీ !

మనుషులకు గల తెలివిలోపల
హెచ్చుతగ్గులు గలుగుచుండును
ఈశ్వరుని విజ్ఞానమందున
హెచ్చుతగ్గులు లేకయుండును

సూర్యచంద్రులు మొదలుగా గల
దివ్యలోకములెవని గర్భము
నందు నిమిడియు వెలుగ నేర్చునొ
అతని పేరె హిరణ్యగర్భుడు

మనిషి చేతనె వేదమనునది
ప్రభవమొందిన నదియు కూడా
సాక్షికమ్మగు సత్యమునకే
పట్టమును కట్టంగజూచును

పూర్ణసత్యము వేద విద్యయె
పూర్ణ పురుషుడు సృష్టికర్తయె
పూర్ణసౌఖ్యము వేదధర్మమె
పూర్ణవాదము త్రైతవాదమె

ఒకటి శంకరుడుచ్ఛరించిన
ఒకటి రామానుజుడు పలికిన
ఒకటి మధ్వాచార్యుడాడిన
సత్యమేగతి తెలియునండీ ?

ఆత్మతత్త్వము తెలియనందున
నహంకారము తొలగనందున
గొప్ప చదువులు చదివి పండితు
లెప్పుడును కలహించుకొందురు

అందరికి సమ్మతము ధర్మము
అందరికి బోధకము ప్రణవము
అందరికి సాధనము యోగము
అందరికి సాధకము మోక్షము

ఋషులు నడిచిన బాట విడివడి
పసులు నడిచెడి బాటలోపల
నాకరి నొక్కరు కుమ్ముకుంటూ
పరుగు దీయగ నేలనండీ ?



ఉపనిషత్తులు దర్శనమ్ములు
కులమతమ్ముల గూర్చి చెప్పవు
ఎన్ని వ్యాఖ్యానమ్ములున్నా
వేదమార్గమునుండి తప్పవు

అప్రమాణములైన సంగతు
లెంత కాలము నిలిచిపోవునో
అంతకాలము మానవాళికి
త్రివిధ దుఃఖము తప్పదండీ !

మూడు పూటలు మనుజకోటికి
భోజనము లభియించుచున్నది
తిండి యొక్కటె కాదు మానవ
జీవితానికి ప్రథమ లక్ష్యము

ఒకడు మిక్కిలి యొకడు తక్కువ
తిండి దింటూ బ్రతుకుచుందురు
సమముగా వడ్డించు పురుషుడు
పుట్టలేదు జగాన యింకను

మనిషిగా పుట్టంగ సరియా
మనిషిగా మెలగంగా వద్దా ?
మనిషి మనిషిగ నడవనప్పుడు
మనుజ జన్మకు లాభమేమిటి ?

మనుషులా ఈ మనుషులక్కట !
మానవత్వము విడిచిపెట్టిరి
ప్రభువులా ఈ ప్రభువులక్కట !
ప్రజల బాగును తుడిచిపెట్టిరి

కలహములు ధ్యేయమ్ములాయెను
కుట్రలే కృత్యమ్ములాయెను
వంచనలు సౌలభ్యమాయెను
వసుధ యనగా అర్థమిదియా ?

క్షణము దప్పక యంత్రములు త్యజి
యించు కాలుష్యమ్ము చేతను
దెబ్బతిన్నది శాంతిదాయక
మైన పర్యావరణమంతయు

రోజురోజుకు కలుషితమ్మై
కష్టములు కలిగించు పర్యా
వరణమును రక్షించు బాధ్యత
విస్మరించగరాదు జనులిక

విషము నిండెను గాలిలోపల
విషము నిండెను నీటిలోపల
విషము నిండెను మతుల లోపల
కల్తి కానిది యెక్కడండీ !



తనువునిచ్చెడి వాడు దేవుడు
బలము నొసగెడి వాడు దేవుడు
సకలమెరిగిన వాడు దేవుడు
సకలమును నడిపించు దేవుడు

మనుషులను విభజించు రచనలు
మంటలను రగిలించు రచనలు
నాస్తికము బోధించు రచనలు
ఇంకనా యికపైన చెల్లవు

ఈశ్వరుని వర్ణించు రచనలు
వేదమును బలపరుచు రచనలు
విశ్వమును ప్రేమించు రచనలు
విరివిగా రావలయునింకను

ఆర్షవాదమె సాధువాదము
ఆర్షవాదమె శుద్ధవాదము
ఆర్షవాదమె విశ్వవాదము
అన్ని తెలుగుల వారికిన్

దివ్యమైనది ఆర్షవాదము
భవ్యమైనది ఆర్షవాదము
ఆధునిక మీ ఆర్షవాదము
అన్ని తెలుగుల వారికిన్

అఖిల మానవ కోటికెయ్యది
హితమొ, అదియే ఆర్షవాదము
శాంతి సౌభ్రాతృత్వములు విరి
యించు నట్టిదె ఆర్షవాదము

ఆర్షవాదము వేదమూలము
ఆశ్రయింపందగు రసాలము
అందరిని ప్రేమించు కాలము
అదియు దేనికి కాదు వాలము

వేదమున ప్రతి పాదితమ్మై
వెలుగుచున్నది త్రైతవాదము
విజ్ఞులగు విద్వాంసులెల్లరు
దానినే తెలియంగ వలయును

ప్రకృతి యీశుడు జీవులనగా
మూడు తత్త్వములలరుచున్నవి
ముఖ్యమగు నీ మూడు తత్త్వము
లున్నవనుటే త్రైతవాదము

ప్రకృతి యెప్పుడు మార్పుచెందును
మార్పుచెందక ఎల్ల వేళల
చిత్ స్వరూపము తోడ ఆ జీ
వేశ్వరులు భాసిల్లుచుందురు



సమయ మెందుకు వాదములతో
సమయజేతురు బుద్ధిమంతులు ?
ఆర్షవాదమె సత్యవాదము
ఆచరించుడు సాధువాదము !

వేదమే ప్రవచించు చున్నది
విశ్వమెట్టుల నడవ వలెనో,
అంతకంటెను గొప్పగా వచి
యించుదానిని చూపగలరా ?

అభ్యుదయమను శబ్దమునగల
యర్థమెఱుగని వ్యర్థజీవులు
వర్గ సంకుచితార్థమున బడి
కొట్టుకొని పోవంగ సాగిరి

ఐహికాముష్మిక సుఖమ్మే
యభ్యుదయమను మాటకర్థము
లోకహితమును గూర్పు మాటల
కర్థ సంకోచమ్ము గూర్తురె ?

ఆవు చేలో మేయుచుండగ
దూడగట్టున ఎట్టులుండును ?
నేత సన్మార్గమును దప్పిన
ప్రజలు సత్పథగాము లౌదురె ?

అగ్నినార్యులు పూజ సేసి ర
టంచు పలువురు పలుకుచుందురు
అగ్నియనగా జడము కాదిట
అగ్నికర్థము ఈశ్వరుండని

పశువులను ఖండించి, యధ్వర
మాచరించరు విబుధులెప్పుడు
అధ్వరమ్మన హింసలేనిది
యందరును చేయంగ దగినది

వెయ్యి సంవత్సరములందున
పుట్టినాడొక ఋషి వతంసుడు
అతని పేరే దయానందుడు
ఆర్య సమాజ స్థాపకుండు

శ్రీ దయానందుండు వైదిక
సంస్కృతిని పునరుద్ధరించెను
వేదవేదాంగములలోని య
థార్థ తత్వము తేటపరచెను

వేదములలో అర్థమిదియని
తెలియజేసిన విబుధ వర్యుడు
వాదములలో గెలిచి యితరుల
గర్వమడచిన జ్ఞానసూర్యుడు



ఆదిమానవుడేమి తెలియని
యర్భకుండని వాదుసేతురు
కాని యాతనికున్న జ్ఞానము
లోన మనకు శతాంశమున్నద ?

ఆకులలములు తినెడివాడని
చెట్టుతొఱ్ఱల నుండు వాడని
ఆదికాలపు మానవుండని
గేలిసేయకు డార్యుడాతడు

మంచి మార్గము చూపువాడే
మనుజ కోటికి శత్రువాయెను
వంచనకు పాల్పడెడివాడే
వదల జాలని మిత్రుడాయెను

పేదలను ప్రేమించగానే
పెద్దవాడని సన్నుతించక
ఎన్నడైనా పేదవాడై
యున్నవాడా ? చూడవలయును

అందరిని మెప్పించు పాలన
మంద జేయుట కష్టమేయగు
ధర్మమును పాటించగల్గిన
దైవమునకది యిష్టమేయగు

సర్వకాలములందు నొకటిగ
సర్వదేశములందు నొకటిగ
సర్వమానవులందు నొకటిగ
సాగుచుండెడి యదియె ధర్మము

జన్మనిచ్చిన తల్లిదండ్రులు
వేరువేరుగ గానిపింతురు
కాని ఈ బ్రహ్మాండ మంతటి
కొక్కడే జనకుండు దేవుడు

కర్మలెప్పుడు చేయకుండును
కర్మఫలముల నంటకుండును
కనుకనే యీశ్వరుడు దేహము
నెన్నడును ధరియింపకుండును

కర్మఫలముల బట్టి మనుజులు
భూమిపై జన్మించుచుందురు
కర్మఫలములు ముగియగానే
ముక్తిఫలమును జేరుకొందురు

ఆత్మ క్షణికంబనెడి వాదము
లేవదీసిన వాడు బుద్ధుడు
కాని యాతండవతరించా
డనెడి వాదము సత్యమెట్లగు ?



మూర్తి పూజలె కీర్తి పూజలు
భుక్తికోసమె భక్తి భావము
వేదమొకటే జ్ఞానదుర్గము
యోగమొకటే ముక్తి మార్గము

యుగములను చైతన్య పరిచిన
రామకృష్ణులె దివ్య పురుషులు
వారి నాదర్శంబుగా గొని
వసుధ పై నడవంగ వలయును

రాజనందనుడైన రాముని
రాజధర్మము లెఱుగవలయును
యోగిపుంగవుడైన కృష్ణుని
జ్ఞానమార్గము తెలియవలయును

వట్టిమాటలు కావు కవితలు
పిచ్చి రాతలు కావు కవితలు
సత్యమును దర్శించు ఋషులకు
సమ్మతమ్మై నిలువ వలయును

కార్యకారణ భేదములతో
వస్తుతత్త్వము నెఱుగవలెనని
ధరణిపై వైశేషికమ్మను
దర్శనము బోధించుచున్నది

ధర్మమీశుని సాయముననే
ధరణిలో తెలియంగ నేర్తుము
సత్యధర్మాచరణముననే
సత్ఫలమ్ముల బడయనేర్తుము

వ్రతము చేతనె దీక్ష గలుగును
దీక్షచే సత్కారమబ్బును
లోకమున సత్కారముననే
శ్రద్ధయనునది యుద్భవించును

వీరవనితల జేయు విద్యలె
నారులెల్లరు నేర్వవలయును
స్త్రీలు పురుషులకంటె తక్కువ
కాదు కాదని తెలియవలయును

ఒకని కంటెను మించి యొక్కడు
లోకమందు ప్రసిద్ధి పొందును
మూడు కాలములందు కీర్తిని
పొందువాడొక డీశ్వరుండే

మనిషి జ్ఞానమునందు తక్కువ
లెక్కువలు గనిపించు చుండును
పరమపురుషుని జ్ఞానమెప్పుడు
నొక్క తీరుగ నలరుచుండును



మానరక్షణ సేయజాలని
మనుషులుండిన సభలు సభలా ?
కల్పనాత్మక కథలతోడను
పొద్దుపుచ్చెడి కవులు కవులా ?

ఎక్కడో ఈశ్వరుడు కలడని
యెవ్వరో వచియించినంతనె
ఉన్నచోటును విడిచిపోయెద
రన్నలారా ? జ్ఞానమిదియా ?

జడము నారాధించు వారలు
జడులుగానే మిగిలిపోదురు
చేతనమ్మును గొలుచువారలు
చేతనములై వెలిగిపోదురు

రాయిరప్పకు మహిమలేదని
యెన్నడో గురజాడ పలికెను
మహిమలన్నవి ఆత్మలందే
మంచి మనిషిని వెదకవలెనోయ్

మంత్రమునగల యర్థమెఱిగిన
యర్థమును పరికించి నడిచిన
మానవుని యా జీవనమ్మే
మహిమగలదై సాగిపోవును

శ్రద్ధతో మంత్రమును చదివిన
మంత్రమున గల యర్థమెరిగిన
నర్థమును గమనించి నడిచిన
నంతకంటెను యేమిగావలె !

ఎవరికిష్టంబైన రీతిగ
వారలర్థము చెప్పుచుండిన
నెవరి యర్థము తీసుకోవలె
నెవరి యర్థము విడిచిపోవలె ?

మంత్రమున గల యర్థమిదియని
మంత్రద్రష్టలె చెప్పవలయును
మంత్రద్రష్టల యర్థమును గొని
మానవులు నడవంగవలయును

ఒకరి సుఖమును దోచుకొని వే
రొకరు కులుకుట న్యాయమేనా ?
క్రూరమృగములు సైతమట్టుల
వ్యవహరించగ చూడగలమా ?

బాల్యమాదిగ నమ్మినానని
భ్రాంతిలోనే మునుగుతారా ?
నిజము తెలిసిన పిదపకూడా
నియతి విడిచియు నడుస్తారా ?




ఆత్మపరముగ నీవు నేనూ
అందరమును సమానులము కద !
కేవలము ప్రాకృతిక సంపద
చేత మాత్రమె హెచ్చుతగ్గులు !

భక్తివాదము భుక్తి వాదము
యుక్తివాదము రక్తివాదము
ఎందుకయ్యా చెత్తవాదము
తెలుసుకోవలె నార్షవాదము

చేతనమ్మగు తత్త్వమొక్కటి
సృష్టి రచనకు వెనుకనున్నది
సృష్టిచేతన కారణమ్మును
తెలిసి నడచిన సుఖము గలుగును

తల్లిదండ్రులు గురువు లక్కట!
సత్ప్రవర్తన కలిగియుండిన
బాలబాలికలెల్ల రుత్తమ
పౌరులై వెలుగొందకుందరె?

అల్పులకు మనమెంత జెప్పిన
యర్థమిసుమంతైన కలుగదు
తిమిరమును బరిమార్చు వెలుగులు
మిణుగురులకింకెట్లు తెలియును ?

హింస సేయుటబద్ధమాడుట
బ్రహ్మచర్యము విడిచి నడచుట
దోచుకొనుటయు దాచుకొనుటయు
పాపహేతువులై చెలంగును

బ్రహ్మ, విష్ణువు, శివుడనంబడు
పేరులొకనికి చెందియున్నవి
ఒకని నొక్కని కంటె నెక్కువ
చెప్పబూనుట సాహసమ్మగు

ఎవని శాసనమునకు లోబడి
పంచభూతములొప్పుచుందునో
యట్టి దేవుడె జీవకోటికి
సర్వదా ఆరాధనీయుడు

అంత మాయగ కొట్టి వేసెడి
యజ్ఞులను పట్టించుకొనకుడు
సృష్టిరచనకు మూలమీశుడు
ప్రకృతి సృష్టికి మూలద్రవ్యము

పనికి మాలిన వాదములతో
ప్రజలనెందుకు మోసగింతురు?
సత్యమగు జ్ఞానమ్ము కంటెను
సంపదలు వేరొండుగలవా?



యోగివర్యుడు జ్ఞానసూర్యుడు
ఋషిదయానందుండు చెప్పిన
త్రైతమే వేదమ్ములో ప్రతి
పాద్యమగు సిద్ధాంతమండీ !

గతశతాబ్దమునందు వెలిగిన
ఘనుడు శ్రీ మద్దయానందుడు !
అతడు వేదోద్ధారకుండగు
నార్షవిద్యారక్షకుండగు

వేద మాధారమ్ముగా గొని
విశ్వనరులను సంస్కరించగ
ఋషి దయానందుండు చూపిన
మార్గమే లోకోత్తరమ్మగు

మనుజులందరి నొక్కజాతిగ
చూడవలెనని పలికెనాతడు
వేద మార్గమునందు నెల్లరు
నడవ వలెనని పలికెనాతడు

వేద సిద్ధాంతమ్ము నెఱుగక
వేదనకు లోనైన గురువులు
నూతనమ్మగు వాదములతో
శిష్యులకు గాలాలు వేసిరి

ఇంతకీ లోకమ్ము భ్రమలో
నెంతకాలము మునిగిపోవునొ?
ఋషి దయానందుండు చూపిన
సత్యపథమున నిలువకుందునొ ?

ప్రకృతి యెప్పుడు జడపదార్థమె
జీవుడెప్పుడు చేతనుండే
ఈశుడెప్పుడు సృష్టికర్తయె
మూటితత్త్వమె త్రైతవాదము

అగ్ని గానము సేయుచున్నది
అగ్ని వర్షము కురియుచున్నది
అగ్ని గ్రహముల ద్రిప్పుచున్నది
అగ్ని జీవన మొసగుచున్నది

విశ్వహితమును దాల్చునగ్నియె
సృష్టిరచనకు మూలమగ్నియె
కాలచక్రము ద్రిప్పునగ్నియె
కర్మఫలముల నొసగు నగ్నియె

ఆశ్రయింపందగిన వానిని
ఆశ్రయించిన ఫలము గలుగును
సృష్టికర్తయె ఆశ్రయింపం
దగిన దేవుడు ప్రాణికోటికి



మూడు కాలములందు వేదము
స్వయముగా వెలుగొందుచున్నది
అన్ని విషయములందు వేదము
మూలమై యలరారుచున్నది.

కర్తలేకనె సృష్టి యేర్పడు
ననుట సత్యము కాని వాదము
కుంభకారుడు లేక మట్టియె
కుండ యగునని చెప్పదగునా ?

అణువులోపల నున్న దేవుడె
యవని యంతట నున్న దేవుడు
అవని యంతటనున్న దేవుడె
ఆత్మలోపలనున్న దేవుడు

పూర్ణ పురుషుని నుండివెడలిన
పూర్ణమగు జ్ఞానమ్ము వేదము
అగ్నివేదము అగ్ని నాదము
అవనికెల్లను శిరోధార్యము

అగ్నినెవ్వడు మూటగట్టును ?
వేదమెవ్వడు దాచిపెట్టును ?
ఇంక నాలస్యమ్ము సేయక
నిప్పుడే అమృతమ్ము గ్రోలుడు

ప్రాణికోటికి తండ్రి దేవుడు
మనుజకోటికి పలుకు వేదము
వేదమొక్కరి సొత్తు గాదని
వేదమే ఘోషించుచున్నది

మనిషి మనిషిగ మెలగవలెనని
మనకు వేదము చెప్పుచున్నది
తరువు తరువై నీడనొసగిన
లోకమున కింకేమి కావలె ?

ఎప్పటికి సత్యమ్మె గెలుచును !
ఎప్పటికి న్యాయమ్మె గెలుచును !
ఎప్పటికి ధర్మమ్మె నిలుచును !
ఎప్పటికి వేదమ్మె నిలుచును !

పూర్ణసత్యమునొక్క చోటనె
ప్రోదిచేసిన నదియె వేదము
దేవదేవుని నుండి వెడలిన
దివ్యగాన సుధాప్రవాహము

నేత పద్ధతి తప్పి నడచిన
కోతులై జనులెల్ల నడుతురు
మంత్రులకు పాఠాలు నేర్పెడి
బదులు ప్రారంభించవలయును



బ్రతుకుకక్కరవచ్చు చదువులె
బాలలకు నేర్పించవలయును
నాల్గు పురుషార్థముల తడవని
నవ్య మార్గము లెందుకయ్యా!

అమ్మ భారతి యడుగుచున్నది
వీరరసకావ్యంబులేవని?
అయ్యయో మన కవులు రాసిన
వన్ని శృంగారమ్ములేనా ?

నిదురవోయిన జాతినెవ్వడు
తట్టిలేపునొ పట్టిలేపునొ
ఆతడే యుగపురుషుడై మన
యంతరంగములందు నిలుచును

వాగులొకటై చెఱువులోపల
కల్మషమ్మును నింపినట్లుగ
దివ్యభారత వాఙ్మయమ్మున
దిక్కుమాలిన కథలు జేరెను

ప్రతిభ గుర్తింపునకు రాదని
పండితులు విలపింతురక్కట !
కాని ప్రతిభను లోకమున గు
ర్తించడానికి ప్రతిభగావలె

కుక్క గొడుగుల వోలె నక్కట
రోజుకో వాదమ్ము పుట్టెను
ఎంతకాలము వాదభేదము
లింక వేదము తలుపు తట్టుదు !

విగ్రహమ్ములు పూజ సేతురు
ఆగ్రహమ్ములు మానకుందురు
ఆగ్రహమ్ములు మానవలెనని
విగ్రహమ్ములు చెప్పవకటా !

చచ్చిపోయిన వారి కడుపులు
నింపగల్గిన శక్తిశాలురు
తిండికొఱకై యంగలార్చెడి
దీనులను పరికించలేరా?

కల్బురనియెడి పేరుతో మన
సంస్కృతిని ధ్వంసమ్ము చేసిరి !
హింసమానుట, సత్యమాడుట
హితము గూర్చుటగాదె సంస్కృతి ?

విశ్వ సంస్కృతి పేర జరిగెడి
వింతలెన్నో చెప్పజాలము
బ్రేకుడ్యాన్సులు బూతుపాటలు
కాకిగోలలు గావుకేకలు !



కులం ఒద్దని మతం ఒద్దని
ప్రాంతమొద్దని పలుకువారే
అన్ని నచ్చిన పిదప బహుమతు
లంద జేయ నిరాకరించిరి

వ్యాసరాజము గ్రంథరాజము
కావ్యరాజము కథారాజము
రాజకీయము గానిదేదీ
వెదకి చూసిన గానిపించదు

తల్లి, తండ్రీ, గురువు, నాయకు
డనగ నల్వురె ఉత్తమోత్తము
జీవనంబును గల్గిలోకుల
కనుకరింపం దగిన వారలు

వీరిలో ఏ ఒక్కరైనను
నీతి దప్పిన చాలునక్కట !
దేశమునకు మహోపకారము
చేసినట్లుగ దలపవలయును

వ్యక్తిగతమగు కీర్తి కొఱకై
వ్యక్తివాదము లుద్భవించెను
సత్యమై యెల్లరకు మేలొన
రించునట్టిది ఆర్షవాదము

గాలినందరు పీల్చుచుండిరి
నీటినందరు గ్రోలుచుండిరి
కాని యందరి మేలుగోరెడి
సత్యపథమును ద్రొక్కకుండిరి

దేశచరితల గూర్చియెవరో
దిక్కుమాలిన మాటలల్లిరి
దివ్యమగు తమ దేశ చరితను
తెలివితో శోధించవలయును

కూలిపోయిన దేశచరితల
గూర్చి శ్రీశ్రీ రాసెనట్టుల
దివ్య భారత దేశచరితను
తప్పకను దర్శించవలయును

రెండు శక్తులు పీకులాడిన
చరిత శ్రీశ్రీ పుట్టుననియెను
రెండు శక్తుల మైత్రి చేతనె
చరిత చెన్నప పుట్టుననియెను

విశ్వభాషల కెల్ల మూలము
సంస్కృతమ్మని తెలియవలయును
దేవభాషే నిలిచి వెలుగగ
దేశభాషలు మారుచుండును



సంస్కృతమ్మును విడిచి పెడితిమి
సభ్యతలకే దూరమైతిమి
మాతృభాషను విడిచి పెడితిమి
మాతృద్రోహము సేయుచుంటిమి

గిడుగుచే లాభంబు తెనుగుకు
కలిగినది వందేళ్ల క్రిందట
ఆంగ్లమనియెడి పిడుగుపడినది
ఆంధ్రమును రక్షించునెవ్వడు ?

బ్రౌను తెనుగును నేర్చి మనకై
గొప్ప మేలును చేసియుండెను
తెలుగు వాడే తెలుగు భాషకు
తెగులుగా ఈనాడు నిలిచెను

ఇంగిలీషే ప్రాణమాయెను
ఇంగిలీషే లోకమాయెను
దేశభాషల కించుకైనా
గౌరవము కనిపించదాయెను

పనికి మాలినవాడు సభలో
పదవినధిరోహించుచుండెను
ప్రకృతినెఱుగని వాడు పర్యా
వరణ మంత్రై వెలుగుచుండెను.

తాగి తందానాలు పాడిన
నదియు నొక సంగీత మౌనట
పిచ్చి.కూతలు వ్రాయగల్గిన
నదియునొక సాహిత్యమౌనట

భాషపై యధికారముండదు
భావమున గాంభీర్యముండదు
శబ్దములలో పొందికుండదు
ఆతడు సహస్రాబ్ది కవియట !

ఒక్కరిద్దరు తప్ప సభలం
దుచిత భాషణ సేయరెవ్వరు
కాలమును హరియించు నధికా
రంబు వారల కెవ్వరిచ్చిరి ?

బాలలకు నాల్గక్షరమ్ములు
బాగుగా నేర్పించవలెనని
ప్రభుత ఉద్యోగమ్ము నొసగిన
పంతులేమో సెలవు పెట్టెను

గుడ్డివాడొక గుడ్డివానికి
మార్గమును చూపించినట్లుగ
ఒక్కడొకనికి చదువు చెప్పుచు
గురుపథమ్మున జెలగుచుండెను



ప్రతిభగలవాడేకులమ్మున
ప్రభవ మొందిన దోషమేమిటి ?
ఋషుల కులములనెఱుక పరచెడి
వారలెక్కడనైన గలరా ?

పేరు చివరల కులము పేరులు
పెద్దరికమును కలుగ జేయవు
గుణము ముఖ్యము కులముగాదని
శాస్త్రములు ఘోషించుచున్నవి

అన్నపానీయముల చేతను
వలయు వస్తు చయమ్ము చేతను
బ్రతికి యుండిన తల్లిదండ్రుల
తృప్తి పరచిన తర్పణమ్మగు

బ్రతికి యుండిన తల్లిదండ్రుల
గురుజనమ్ముల బంధుజనముల
శ్రద్ధతో సేవించుచుండిన
శ్రాద్ధమగునని చెప్పిరార్యులు

భ్రాంతి మూలకమైన చదువులు
శాంతినీయగజాలవండీ
అందరికి చెందినది వేదము
అందులో లేదండి భేదము

ఆత్మలను కలపంగ గలిగిన
అద్భుతమ్మగు విద్య వేదము
అందరిని రక్షించు వేదము
నందరము రక్షించవలయును

అగ్ని, వాయువు, సూర్యు డంగిరు
డనెడి ఋషివరులబ్బురమ్ముగ
నాల్గు వేదములభ్యసించిరి
ప్రథమమున పరమేశు వలనన్

వేదములు పరమేశ్వరునిచే
విశ్వమున కందింపబడినవి
కనుకనే యవి మనుజ కోటికి
ధర్మముపదేశించుచున్నవి

అగ్నియే జ్ఞానమ్మునిచ్చును
అగ్నియే తేజమ్ము నిచ్చును
అగ్నియే సామర్థ్య మొసగును
అగ్నియే సకలమ్ము గూర్చును

అగ్నిదైవము అగ్ని నెచ్చెలి
అగ్ని బంధువు అగ్ని జనకుడు
అగ్ని ప్రాణము అగ్ని వ్యానము
అగ్ని నాదము అగ్ని వేదము



అగ్నిమీళే పురోహితమను
మంత్రమున గల యగ్నికర్థము
స్వప్రకాశకుడైన యీశుడె
కాని కాదది నిప్పు మాత్రము

ఈశ్వరా! పరమేశ్వరా! ని
న్నగ్నివని భావింతురార్యులు
నీవె సృష్టి స్థితిలయమ్ములు
సేయగల్గిన శక్తిశాలివి !

అగ్ని! మమ్ముల జ్ఞాన పథమున
నన్నివేళల నడుపుచుండుము
పాపములచే మమ్ము విడివడ
జేసి సంరక్షించుచుండుము

గోప దేవుండగ్ని గోళము
నేను చంద్రునితో సమానము
గురువొసంగిన జ్ఞానరశ్మిని
చల్లగా లోకానికిత్తును